క॥ బలవంతుల నడుమనిజిక్కి
బలహీనులు గొప్పబాధ ♦ బడుదురు సుమ్మా
నలుగనె సన్నంపుఁ బెసర
పలుకులు నిరుగళ్ళమధ్యఁ ♦ బడివడిరామా 45

క॥ కాలముఁగని పోవలయును
వేళకు సమకూరుఁ ♦ బనులు విఫలతగాకఁ
జాలము జేయుచుఁ బోయిన
ఈలిచ్చిన రైలుబండి ♦ చిక్కదురామా 46

క॥ చాటను నొంటరి నడువకుఁ
బూటకపున్ మాటలాడఁ ♦ బోకుము సభలోఁ
బోటికి నర్థము నొసఁగకు
పోటీలకు ముందు నడువఁ ♦ బూనకురామా. 47

క॥ ప్రాముఖ్యము ప్రతినరునకు
సామము ప్రతికార్యయత్న ♦ సఫలితమునకై
పామరులకు లోఁబడి తా
నేమము నెరవేర్పవలయు ♦ నేర్పుగరామా. 48

క॥ సరసులు విరసులు నొకరుగఁ
బురుషులు గనుపించుచుంద్రు ♦ బుద్ధిని నొకటే
నయరఁగ జున్నును వెన్నయుఁ
బెఱవర్ణముగాక రుచుల ♦ వేఱగురామా. 49

క॥ తాపసులు లేని వనమును
భూపాలుఁడు లేని గొప్ప ♦ భూభాగంబున్
దీపము లేని గృహంబును
బ్రాపగు శశిలేని మిన్ను ♦ రమ్యమె రామా. 50

క॥ మేలనగు నర్థము వ్యర్థము
మాలిన్యము గలిగినట్టి ♦ మనుజుని చెంతన్
జాలఁగ వెలిఁగెడు రత్నము
నేలను నున్నంతఁదడవు ♦ నెసఁగను రామా. 51

క॥ పుడమిని మెత్తనివాఁడై
కడఁగినఁ బీనాసివృత్తిఁ ♦ గరుగండేపో
తడయక వెన్నయు మృదువై
కడువడి నలయగ్ని గాని ♦ కరుగదు రామా. 52

క॥ ఈడును జోడగుఁ బెండిలి
వేడుకతో ముచ్చటౌను ♦ బిరబిరఁజూడన్
నాడల కృష్ణుఁడు రుక్మిణి
యాడిన బెండ్లపు దలతు ♦ రందఱురామా. 53

క॥ భుజబల శౌర్యాకరస
ద్ధ్వజనీచయు మేటి ధాటి ♦ పాటవమున నే
విజయము ఘటించి రాజులు
ద్విజులను సేవించినారు ♦ ద్విజులై రామా॥ 54

కం॥ విధియే ప్రధానమనియును
గధలెన్నియొ కానుపించు ♦ ఖండింపంగా
పృథివిహరిశ్చంద్ర నృపతి
విధిచేఁగులకాంతఁ జంప ♦ నెఱిసఁడురామా. 55

క॥ ఓటమిపాటుల? గవికి
వాటిల్లును గవితజేతఁ ♦ బరమపదంబుల్
ఊటఁగల బావికెందుకు
నీటికినై యాత దిగులు ♦ నెక్కొనిరామా. 56

క॥ విద్యయొసంగును విలసిత
సద్యశములు రాజభాగ్య ♦ సరసత్వంబుల్
ఖద్యోతంబగు తేజము
సద్యోవిఖ్యాత మోక్ష ♦ సంపదరామా. 57

క॥ ప్రపగేహపు జనసంతతి
నిపుణత ఘనవంతులగుట ♦ నిక్కముధరలోఁ
విపులఁపు వర్షంబునిడెడు
నెపమున ఘనమయ్యెమేఘ ♦ నికరమురామా. 58

క॥ ప్రారంభముఁజేసి పిదప
వారింపక పట్టుదలను ♦ పదలరు ప్రముఖుల్
బోరునఁ గడుధీరతచేఁ
బారంగదుఁడైనవాఁడు ♦ పార్థుఁడురామా 59

క॥ తనకున్ మాలినధర్మము
దనరగఁ జేయంగరాదు ♦ తద్దయు వేడ్కన్
వినుభూపతిబలి మించిన
ఘనదానముఁ జేసిచెడియెఁ ♦ గదరా రామా. 60

క॥ సుమతింగని మంచి జనుఁడు
విమలాకృతి సంచరింప ♦ వెరపేటికోకో
యమలఁపు మిన్నేటిజలము
తమకము సెడిపోక పాఱుఁ ♦ దవ్వులరామా. 61

క॥ నరునకు ధైర్యము ద్రవ్యము
వరుసగఁ దడవున్న నీతి ♦ బాధలు తొలఁగున్
గురుభక్తియు క్షమ శాంతము
పురుషులకుం బరమునిచ్చుఁ ♦ బొల్పుగ రామా. 62

క॥ విద్యాధనముం గొనుమా
హృద్యంబగు డెందములకు ♦ నింపలరంగా
నుద్యోగము సద్యోగము
విద్యుత్కీర్తులు ఘటించు ♦ వినురారామా. 63

క॥ ఆవుల నిఱ్ఱులఁ జంపుచుఁ
బావురమని మ్రింగు బులులు ♦ వనములనుండెన్
గోవుల గోసెడిఁ గ్రూరులు
దీవుల యందున్న మేలు ♦ తిరముగ రామా. 64

క॥ సంకర వర్ణంబైననుఁ
బొంకఁపు సద్విద్యయుండ ♦ బొరవుండదు గా
పంకమునన్ జనియించిన
పంకజములు గౌరవంబుఁ ♦ బడయవె రామా. 65

క॥ ఉదయమున లేచి పురుషుఁడు
ముదమునఁ దనభార్యనైనఁ ♦ బుష్పమునైనన్
గుదురగు హయమును నైననుఁ
గదియం జూడంగఁ గల్గుఁ ♦ గలుములు రామా. 66

క॥ అంగననమ్మఁగ బోకుము
సంగరమున ముందు కాలు ♦ సాపకుసుమ్మీ
మంగలిపొత్తున కరుగకు
సంగడిలేకుండ దిగకు ♦ జలముల రామా. 67

క॥ అందము చందము ప్రాజ్యత
బొందుగ నొకఁడొందుఁ బూర్వ ♦ పుణ్యము కతనన్
గ్రందుగ గులాబిపుష్పము
సుందరమును గంధమందెఁ ♦ జూడర! రామా. 68

క॥ సిరిగలిగినంత వఱకుం
బరులే పరమాప్త బంధు ♦ వర్గము గాఁగా
అరయగ మధుమక్షికములు
పెరదేనెగలంతవఱకు ♦ విడువవు రామా. 69

క॥ శాంతము తన చెంతను నా
సాంతముగలిగియున్న ♦ సరివచ్చుఁబనుల్
సుంతయు గోపముఁ జెందని
వింతస్వాంతుఁడు యయాతి ♦ వినరా రామా. 70

క॥ ప్రజలకు మోక్షాక్రమమిడి
ఋజుపథమున నేలినట్టి ♦ రుక్మాంగదుఁడే
నిజమైన రాజతలన్
నిజబాంధవు లెందుకపుడు ♦ నిజముగ రామా. 71

క॥ పతిభక్తి మెండుగాఁ గల
సతులిల రక్షించుచుంద్రు ♦ చక్కఁగఁబతులన్
గతివశమునఁ జనిపోయిన
పతినిన్ సావిత్రి ప్రోచెఁ ♦ బ్రాఘిగ రామా. 72

క॥ సుగుణులయెడ గుణహీనులు
పొగులుచుఁ బైపైకి దుమికి ♦ పోరిచత్తురుగా
రగిలెడు దీపంబు పయిం
దగులుచు మృతినొందు మిడుత ♦ దండులు రామా. 73

క॥ హరుఁడైన ధాతయైనను
పురుషోత్తముఁడైన గాని ♦ పూర్ణానుమతిన్
సరిరాదియ్యఁగ సకలము
పరగన్ గురుఁడిచ్చినట్లు ♦ పరులకు రామా. 74

క॥ పరమ సుశీలావళిలో
శిరమును మోదించి పతిని ♦ సేవించెడునా
తరుణీమణి దమయంతియు
సిరి ద్రౌపది చంద్రమతియు ♦ చెప్పఁగ రామా. 75

క॥ ప్రభు వెట్టి ప్రౌఢుఁడయినను
సభలో నియోగ్యి లేక ♦ జరుగము; వద్దా?
విభవంపు లక్ష్మి గళమునఁ
బ్రభగల మణిహార తరళ ♦ మండము రామా. 76

క॥ చేయఁగ సత్సహవాసము
జాయగ నొగి వచ్చుచుండు ♦ సంపదలిలలోఁ
బాయని మైత్రిఁ గుచేలుఁడు
జేయఁగ శ్రీకృష్ణుఁడిచ్చె ♦ సిరివడి రామా. 77

క॥ ఆచారము నడుగంటె దు
రాచారము ప్రబలినపుడు ♦ నతిశీఘ్రముగా
హాహాటంబున్న ప్రచా
రాచార్యులఁ గూర్పవలయు ♦ నభిరతి రామా. 78

క॥ ధనమును మానముఁ బ్రాణముఁ
దనదేశవిముక్తి కొఱకు ♦ దానంబిడి తా
ననుదినము బాటుపడఁగన్
ఘనుఁడై విలసిల్లు గాంధి ♦ కరణిఁ రామా. 79

క॥ ఓర్పునకుండగు భూరము
తీర్పునకుండగినవాఁడు ♦ త్రిభువన విభుఁడే
మార్పునకుఁ గాని పురుషుఁడు
నేర్పునకున్ మోక్ష గాంధి ♦ నిజమురరామా. 80

క॥ చీకటిఁ బాపెడు వెలుతురు
ప్రాకటముగ నబ్ధిదాటు ♦ పడవలు మఱియున్
శాకాది ప్రభుఁగాంచెను
జేకొని ప్రజఁబ్రోచువాఁడు ♦ శ్రేష్ఠుఁడురామా. 81

క॥ మాతాపిత సుతుఁడైనహో
సీతాపతి పేరుమఱచి ♦ చెడఁదిరుగు నెహో
ఘాతకుఁడగు ఘంటాసుర
పాతకుఁడే ముక్తిఁజెందె ♦ భాసిలెరామా. 82

క॥ వెలఁగలిగిన సలిలంబులు
నలుపగుఁ గలహంస బిందు ♦ నగమంతమగుల్
వెలయాలి సద్గుణంబులు
కలనైనం గాంచఁబోము ♦ గదరా రామా. 83

క॥ ధనికులఁ ఖూనీకేసులో
గనుఁగొని విడిపించు చుంద్రు ♦ కత మెయ్యదియో
అనలము పూరిండ్లనదుముఁ
ఔనవగు లోగిండ్లఁజూచి ♦ విడచునురామా. 84

క॥ చేఁజారకు మాటనకుము
పూజారుల కొంపకడకుఁ ♦ బోకుర యెప్పుడున్
బాజారులఁ గ ఁదినగకు
రాజుల పొడిమాటనమ్మ ♦ రాఘవరామా. 85

క॥ ఉపకారము ప్రతిమనుజుఁడు
విపులముగాఁ జేయవలయు ♦ వేగిరపడుచున్
ఉపకార మొకటి సల్పిన
జపతపములు నూర్లుగాని ♦ సాటియె రామా 86

క॥ లోకోపకారమునకై
తా నుందక ప్రాణమియ్యఁ ♦ దగునీధరలోన్
వాకొనఁదగు త్యాగంబునఁ
దేఘవతోనిడె దధీచి ♦ దేహము రామా. 87

క॥ ఫలితము గలదని యాత్రలు
సలలితమగుఁ బత్తిపిడి ♦ జరుపుదురు జనుల్
గలవని పత్రంబులతో
సలుపవె తీర్థములు పక్షి ♦ జాలము రామా. 88

క॥ తనతల్లి బానిసత్వము
మనసిడి పోగొట్టువాఁడు ♦ మాతకు సుతుఁడౌ
వినత కటువైన తేయుఁడు
దనరఁగఁ దొలగించె మాతృ ♦ దాస్యము రామా. 89

క॥ పరకాంతలఁ దల్లులవలెఁ
బరధనమును మట్టివలెనుఁ ♦ బాటించుచుదాఁ
బరులకుఁ దనకును భేదము
పరికింపఁగఁ బరముగద్దు ♦ పరగన్ రామా. 90

క॥ ఎంతయుఁ దగునే లలితుల
కాంతలవిడనాడి వారకాంతలఁగూడన్
జెంతంగల చింతామణిఁ
జింతించక గవ్వఁగొనుటె ♦ చెచ్చెర రామా. 91

క॥ ధనవంతులకు నతిశాంతపుఁ
గొనమున భాసిల్ల నొప్పు ♦ గుణనమ్ముండై
కొవిసారము సురసాలము
గనుపించడకువగ నెమ్మి ♦ గాంచఁగ రామా. 92

క॥ ప్రాపంచక సౌఖ్యమ్ములు
భూపాలుర కైనఁగాని ♦ బుద్బుదములె కాన్
ప్రాపున నీవుడమిజనులు
తాపసవరు లంచఁగొనుట ♦ తగురా రామా. 93

క॥ పల్లెత్తుమాట మీరకు
కల్లుం ద్రావఁగఁబోకు ♦ కాసం తేనిన్
వెల్లునఁ గోపముఁ బూనరు
సల్లలితులు శూద్రుశేని ♦ జగతిన్ రామా. 94

క॥ బీదలసాదలఁ బ్రోచెను
సాదరమగు నాత్మమార్గ ♦ సాధనములవే
పాడుగ నెలకొల్పవలయు
మేదుర గంభీరదీక్ష • మేదినిరామా. 95

క॥ చీమలు దోమలు మొదలుగ
భూమింగల ప్రాణికోటి ♦ పొల్పుగఁదానై
ధామమున వెలుఁగు దేవునిఁ
బ్రేముడిజ్ఞానమునఁ గనుట ♦ శ్రేయమురామా. 96

క॥ సహజంపు భక్తి కవచము
వహియించిన యట్టిభక్తి ♦ పసునకుఁ గొమవా
అహరహముఁ దాడనంబుల
మహిలోఁ గమఠంబు భీతి ♦ మసలునెరామా. 97

కం॥ కైకొందురు యాచనచే
రూకలు మాన్యములు మఱియు ♦ రుచిరాంబరముల్
చేకొననేర్తురు స్వర్గము
లోకానసులోకలోక ♦ లోకనరామా. 98

కం॥ పురుగులఁ గప్పలు, గప్పల
నురగంబులు, నురగములను ♦ నురుతరగరుడుల్
గరుడులఁ గ్రూరకిరాతులు
ధరపై సమయించుటెల్లఁ ♦ దధ్యమురామా. 99

క॥ తల్పముపైఁగన సొంపగు
దల్పములేకున్న మేటి ♦ ధామము సున్నా
బల్పగు బున్నాగుపయిం
బొల్పగుఁ బున్నాగులేమి ♦ బొల్పే! రామా. 100

క॥ నారాయణునాదిగురుని
సారెకు నామదిదలంచి ♦ సలలితభక్తిన్
ధీరుఁడగు గురువర్యునిఁ
గూరిమిసలరంగ రాజుఁ ♦ గొల్తును రామా. 101

క॥ భారద్వాజస గోత్రుఁడు
వారకనుతయాజ్ఞవల్క్య ♦ వంశోద్భవుఁడన్
ధారుణి రామయపుత్రుఁడు
నోరూర భుజంగరావు ♦ నుడివెను రామా. 102

క॥ రామా రామాయనునీ
నామము పద్యాంతమందు ♦ నయముగ నెపుడున్
వేమఱు జనులుపఠించిన
ఘామము దురితంబుఁ దొలఁగుఁ ♦ క్షణములొ రామా

సంపూర్ణము.

# కలివిలాపము.

BY

V. BHUJANGAROW.

సీ॥ పంజాబునకుఁ బోయి ♦ పరగియుండెదనన్నఁ
జరచి పంజాబెసం ♦ జాతొగొట్టు
బొంబాయిఁ జేరి నే ♦ భోగమొందెదనన్న
శౌకతాలి మహాత్ము ♦ ఢాకగలదు
పడమటి దేశాన ♦ వసియింతుననుకొన్న
మాపిళాల్ చేతిలో ♦ మరణమగును
దక్షిణ దేశాన ♦ దనరియుండెదనన్న
గుప్తయే యక్కడఁ ♦ గుదిరియుండె
సీగాలు చిన్నది ♦ చెంగియుండెదనన్న
గోపాలుడే బాబా ♦ కోలనేయు
గుంటూరుఁ జూడఁగాఁ ♦ గుదరైనదనుకొన్న
వేంకటప్పయ్యా రయే ♦ వెలసియుండె
మన్యమన్యముఁ జేరి ♦ మనవచ్చుననుకొన్నఁ
దివిరి ప్రకాశుడే ♦ తిరుగుచుండెఁ
గలకత్తఁ జేరితిఁ ♦ గలవు లేదనుకొంటి
దాసు నాకక్కడ ♦ దాపరించెఁ

గీ॥ నెటులబోవుదు నాకు నిం ♦ కేది తెరవు?
పెక్కునందల వత్సరాల్ ♦ బీరుపోకఁ
నన్ని విధముల సౌఖ్యము ♦ లందినట్టి
కలిమహారాజునకు వచ్చెఁ ♦ బ్రళయమిపుడు.

మ॥ నలరాజున్ విలపింపఁ జేసితిని భూ ♦ నాథున్ హరిశ్చంద్రుఁగా
నలఁబంపించితిఁ బంచపాండవుల న ♦ న్యాయంబుగాఁ జెడ్డబా
ధలఁబెట్టించితి, జీవరాశివణకన్ ♦ దర్పంబుజూపెట్టితిన్
దలపంగన్ దుదకెట్టి దుర్గతికి సం ♦ తాపించి, పోనుంటినో.

చం॥ పరమదయాకరుల్ విమల భాసురశీలుర నాత్మబంధువుల్
సురుచిరధీర సారతర ♦ శూరశిఖామణులెంతోధీనుతుల్
పరగు పరోపకారులు ప్ర ♦ భావ గుణోన్నతులీ కలాత్త్ర బం
ధురతర హైందవుల్ గడకు ♦ దుర్ఘటకార్యముఁ బూనుటొప్పునే?

గీ॥ ఉపకృతుల్ జేసిసౌఖ్యమ్ము ♦ లొనరఁగూర్చి
వేగవిద్యాభి వృద్ధిఁగా ♦ వించిప్రబల
రిపుభయమ్మునుఁబాపి సం ♦ ప్రీతిఁబ్రోచుఁ
బ్రాజ్యరాజ్యంబు లోడయ్యెఁ ♦ బ్రజలకిప్పుడు.



